The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H. The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

తూ్రపు బజారు, హైద్రాబాదు, (దక్కన్.)

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

| | | |
|---|---|---|
| సం॥చందారూ ౬-౦-౦<br>అర్థ ,, ,, ౩-౦-౦<br>విడి ప్రతిక ౦-౧-౦ | **GOLKONDA PATRIKA**<br>HYDERABAD, Dn. THURSDAY 24-5-1934 | ప్రాతపత్రికకు<br>వెల ప్రత్యేకము |

103457

సంపుటము ౬ } శా. శ. ౧౮౫౫ శ్రీ భావనామసం॥ నిజవైశాఖ శు॥ ౧౦గురువారము ౧౩-౨-౪౩ ఫ. { సంచిక ౫



ముద్రాపకులు ప్రకాశకులు:— యం. జి. సుబ్రహ్మణ్యం ... హైద్రాబాదు (దక్కన్)

### ముసల్మాను దేశ యాత్రికుడు

తిరుగర:-దేశయాత్రికుడగు హాజిమహమ్మదు అబ్దుల్ ఖాదరుసాహేబుగారు సదాశివపేటనుంచి నిజామాబాదు చేరిరి. తిరుగ ౧౩ వ తారీఖు నిజామాబాదునుండి బయలుదేరి సాయంత్రం ౬ గంటలకు హుమ్నాబాదు చేరిరి. మార్గమధ్యమున వీరికి గాలి దుమారము మరియు వర్షముకలన చాలా అయాసము కలిగెను. ఇంతవరకు వీరు రోజుకు సుమారు ౩౦-౩౫ మైళ్ల దూరముచొప్పున ప్రయాణము చేయుచున్నారని హుమ్నాబాదునుంచి తిరుగర తాకీదువ తెలిపినది.

హాజిఅబ్దుల్ ఖాదరుగారు హుమ్నాబాదునుంచి బయలుదేరి పెల్లుడువచ్చినారు. ౩౦-౩౫ మైళ్లదూరము నడచియుండినను మార్గములో చాలాయిబ్బంది జరిగెనని పెల్లుడు ౧౫ వ తేది ప్రకటనవల్ల తెలిసినది.

### ఉద్యోగ విషయములు

౨వ వహారవహనుంచి బీదుజిల్లాపోలీసు సూపరింటెండెంటుగా కొంతకాలమువరకు మాత్రమే నియోగింపబడిన మహమ్మదుమహమ్మదఖాన్ సా॥ గారు ఆ పదవియందే స్థిరముగా నుంచబడుటకు మంజూరి అయినది: తేది ౧౨ వ తేదినుంచి అఖరువరకు ఒకనెల పూర్తిజీతముపై సెలవు ఇఖ్తదార్ జంగ్ అహమదు సా॥ తహసీల్దారు (తాలూకా కౌతాల) గారికిజిల్లా మహకమా వారి అభిప్రాయానుసారము ఔరంగాబాదు సుబేదారుగారిచే మంజూరిచేయబడెను. సెలవుగైకొనువారి స్థానమున అహమదు మొహ్యొద్దీన్ సా॥ ఫరీజ (ముంతజం మాల్ జిల్లా, నాందేడు) గారిని తాత్కాలికముగా నియోగించిరి.

## అమరచింత సంస్థానము విడుదల

శ్రీమతి భాగ్యలక్ష్మి మహారాణిగారిదగు అమరచింత సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సునుండి విడుదల చేయబడినది.

## పట్టపగలు మక్తేదారుని హత్య

నేరస్థులకు యావజ్జీవపు ఖైదు

దేవరకొండ తాలూకాలోనున్న పాల్వాయిఅను గ్రామము మక్తెదారగు రామేశ్వరరావుగారు ౧వ అర్దిబెహిస్తు పగలు ౯గంటల సమయమునబండిలోకూర్చొని తమగ్రామమునుంచి హైదరాబాదు వెళ్లుచుండిరి. మార్గమధ్యమున ఏడెనిమిదిమంది వీరి కచ్చడమునకు ఎదురుగా వచ్చి రోడ్డుప్రక్కనవున్న ఒక చేనులోకి తీసికొని వెళ్లి అచట వారిని చంపిరి.

స్థానికరక్షక శాఖాధికారులగు అలీనాబుమాల్వి జలాలొద్దీన్ సా॥ మొహతెమీంగారి నిగ్రానిలో ౮ గురు నేరస్థులను, మక్తెదారుభాగస్థుడగు జానకిరాంరావును అరెస్టుచేసి దేవరకొండ న్యాయాధికారులగు మౌల్వీ అబ్దుల్ సలాంఖాన్ సా॥ మున్సఫ్ బియె. యల్. యల్, బి గారిమొదట హత్యానేరముక్రింద చాలాను పేషుచేసిరి. జనాబుమున్సఫ్ సా॥ గారు ఒక వారం రోజులలో మొకద్దమాను విమర్శించి మొకద్దమా ఫద్దు సేషకోర్టుకంపిరి. అలీజనాబు మిస్టరు పింగిలి వెంకటరామారెడ్డి సా॥ [గారవజ్జీ సుభేమెదకు] గారు ౩౧ ఖుర్దాదున విమర్శించి హంతకులకు జన్మఖైదువిధించిరి.

## బేతవోలు మక్తేదారుగారి విజయము

## బేతవోలు రైతులఫిర్యాదు ఓడుట

సూర్యాపేటతాలూకాయందుగల బేతవోలు మక్తెదారులగు మిస్టరు సీతారామ చంద్రారావుగారిపైన ఆగ్రామపురైతులు కొన్నిరోజుల క్రితము మాల్గుజారిలో ఫిర్యాదుదరఖాస్తు యిచ్చియుండిరి. ఈవిషయమై మాల్గుజారివారు ఉభయ పక్షములవారిని [వాది ప్రతివాదులను] విచారించి విమర్శచేసి రాజాగారితరఫున తజ్వీజుచేసి కారువాయి ఖతంచేసిరి.

### సిటీపోలీసు ఫుటుబాల్ బీదరులో జయము బొందుట

బీదరు ౧౭వ తేది:—

(సిటీపోలీసు ఫుటుబాల్) వారు గతశనివారం హైదరాబాదనుంచి బీదరు వెళ్లియుండిరి. [టోర్న మెంటు] లో ఫైనల్సులో బీదరువారి బంతియాటకన్న అయిదు ఆటలలో వీరలు ఎక్కువగా జయము బొందిరి.



## కొప్పర్తిగారి ప్రశంస

(శ్రీఆచార్యకర్వే మహాశయుని జన్మదినోత్సవ సందర్భమున శ్రీమాన్ బుక్కపట్టణము రామానుజాచార్యులవారు పంపిన ప్రబోధ పద్యములు)

సీ. దేశమా పరులచేతనుజిక్కి మరలదా
తమునుపొందఁజాలకున్నంచు శక్తిఁజిక్క
భాషయానైజపూర్వ ప్రాభవముపీడి
సంకరంబగుచు భ్రష్టత్వమందె
మతమూదురాచార మాలిన్యపీడిత
మైపరిహీన జన్యంబునయ్యె
జాతీయతయుతాన సంఖ్యాకవైవమ్య
కలుషితమైమంట గలసిపోయె.

ఆ. వె. దేశభక్తిలేదు, తీవ్రభాషాభిమానంబులేదు, నిజమతంబులేదు
వివిధజాతులకును విహితమైమాత్రంబు
లేదుదాస్యముక్తి లేదులేదు.

సీ. కట్టింపవలెగాదె కరిభంతములునింత
ఘనకళాలలక్షణముగాక?
పెట్టింపవలెగాదె మిగులనజ్ఞానాంధ
కారంబువిద్యా ప్రకాశమునను?
పెట్టింపవలెగాదె ముదితులైయాకవి
రాజితపుస్తకరాజములను?
పెట్టింపవలెగాదె ప్రేమవాక్సుధచేత
మద్రనయుక్త భోజనమ్ముపేదకు?

తే. గీ? స్వేచ్ఛయనఢంకచే బూనిశీఘ్రగతిని
మ్రోయవలెగాదె దిశలుమార్ మ్రోగునట్లు
భరతమాతపెన్నోములఫలముమీకు
కాలిమడుముందుమా పురోగాములగుడు.

గోలకొండ పత్రిక
శ్రీభావనామ సం॥ వైశాఖ శు॥ ౧౦
గురువారము

# ఎన్నికల స్వాతంత్ర్యమునకొక ఆటంకము

ఇపుడు మన హైదరాబాదు నగరమంతయు గష్తీనిషాన్ ౫౩, శాశ్వతముగా రద్దుచేయబడునను ఆశలేకున్నను, ప్రస్తుతము కొద్దికాలము వరకైనను ఆపియుంచబడునట్లు ఆజ్ఞ యెపుడు వెలువడునాయని ఆశతో కనిపెట్టుకొనియున్నది. నగరమందు అనేకవిద్యావంతులకు ఈగష్తీ కొలది రోజులలో జరుగనున్న ఎన్నికలకు ఆటంకముగా కనబడుచున్నది. "ముషీరెదక్కన్" "రయ్యతు", మొదలగు పత్రికలుకూడ గష్తీనిషాన్ ౫౩ ను ప్రస్తుతము ఎన్నికలకొరకైనను, నగరమాత్రమునకైనను కొంతకాలము వరకు అమలు పరుచక ఆపియుంచవలసినదని శిఫారసు చేయునపుడును నగరవాసులలో బహుజనాభిప్రాయమునే వెల్లడించుచున్నవి.

ఈగష్తీ ప్రజల ఆశయములకు పెద్దప్రతిబంధకముగనున్నదని చెప్పుటకిది ప్రథమపర్యాయముకాదు. ఈగష్తీ పుట్టినప్పటినుండియుకూడ నిజాంరాష్ట్రీయులయొక్కయేమి, రాష్ట్రేతరులయొక్కయేమి, భావములు "ఎందుకురా సాధారణ పరిస్థితులలోకూడ ఈ నిర్బంధము" అని విస్మయపూరితములై యుండెను. ఈగష్తీని రద్దుచేయించుటకై విద్యావిహీనతచే కర్తవ్యము తెలియజాలని ప్రజలహితమునకై ఉద్యమించు కొందరు విద్యావంతులు ప్రయత్నములను చేసియుండిరి. గతసంవత్సరము రయీసుల్ముహమాత్యపర్యాయివద్దకు రామచంద్రనాయక్ బారట్లాకారి నాయకత్వమున రాయబారవర్గమువారు పోయి ఏ ఏ నిరపాయకరములును, కుట్రలేనివియు, ప్రజలకు ముఖ్యములును అగు సభలకు అనుజ్ఞలు లభించియుండలేదో వాటినన్నిటిని పేర్కొని, ఆచరణలో యిట్లు ప్రజాహితబుద్ధితో తలపెట్టబడిన ఉద్యమములకు అనవసరముగా అభ్యంతరములను కల్పించుచున్న పైగష్తీని రద్దుచేయించగోరియుండిరి. తర్వాతకొంతకాలమునకు ప్రభుత్వమువారు కమ్యూనికు [ప్రకటన] నొకదానిని చేయుటయు అందులో రాయబారము విషయము పేరెత్తకయే కొన్ని పత్రికల యాక్షేపణలకు ఖండనగా గష్తీనిషాన్ ౫౩ అవసరమని సమర్థించుటయు పాఠకులకు తెలిసిన విషయమే. ఈసంవత్సరము లోకూడ ముల్కీ ఉద్యమము విజృంభణలో నున్నపుడు మ. ఘ. వ. ప్రభువుగారికి ముల్కీసంబంధమగు ఫర్మానును అనుగ్రహించినందుకు కృతజ్ఞతను తెలుపుసభలు కొన్ని జరిగియుండెనుగదా. ఆసభలలోకూడ ముల్కీ ఉద్యమమును ఫలవంతమగునట్లు పోషించుటకై యత్నించుచున్నవారు స్వేచ్ఛగా పనిచేసికొనుటకు గష్తీనిషాన్ ౫౩ అడ్డుతగులుచున్నదని అభిప్రాయము ఈయబడియుండెను.

క్రొత్త క్రొత్త అవసరమువచ్చినపుడెల్లమేమును మాకు దృఢ విశ్వాసపాత్రములైన కారణములను పేర్కొని గష్తీనిషాన్ ౫౩ రద్దుచేయబడవలయునను కోరికను వెల్లడించియుంటిమి. ఇపుడు మఱియొక అవసరము వచ్చినందున పాతవిషయమైనను క్రొత్త పరిస్థితులకు సమన్వయించి చర్చించవలసియున్నది.

ప్రజలచే ప్రభుత్వసంస్థల సభ్యులెన్నుకొనబడు పద్ధతికి మన రాష్ట్రమునకంతయు ప్రారంభమారానున్న నగర మునిసిపాలిటీ యెన్నికలే. ఇంతవరకును మన నగరములో జనసామాన్యమునందెంతమందికి ఎన్నికలన నేమైనది, ఓటులన నేమైనది సరిగా తెలియునో తెలియదో సందేహము. దీనికి నగరమందు చదువను వ్రాయను నేర్చిన వారిసంఖ్యను చూతుము. ౧౯౩౧ వ సంవత్సరపు జనాభా ప్రకారము హైదరాబాదు నగరములో ౧౫ సంవత్సరములకు పైబడిన వయస్సుగలవారిసంఖ్య ౩౩౦౹౩౩. అందులో చదువను వ్రాయను నేర్చినవారిసంఖ్య ౧౧౪౧౨౬. అనగా మైనరుతీరినవారిలో నగరమందు సగమునకు సగము మంది విద్యావిహీనులని స్పష్టమైనది. విద్యవచ్చినసగము మందిలోనైనను ప్రజాపాలనము, ప్రతినిధుల నెన్నుకొని వారిద్వారా నగరపాలనమును నిర్వహించుట యనునది ఏ కొలదిమందికో తెలిసియుండునని నిస్సందేహముగ చెప్పవచ్చును. మనరాష్ట్రమున రాజకీయ పరిజ్ఞానము తక్కువగదా. కాబట్టి నగరములో జనసామాన్యమునకు క్రొత్తవిషయముల నన్నింటిని తెలియపరచవలసిన అవసరముగలదు. లేనిచో ఎన్నికలు జరుగవలసిన ప్రకారము జరుగజాలవు. ఇటువంటి విజ్ఞానప్రచారము కొద్దికాలములో కొంతవరకైనను సాఫల్యము చెందుటకు వీథివీథిలోను బహిరంగసభల నేర్పరచుటకంటె శ్రేష్ఠతరమైన మార్గము లేదు. పత్రికలవలన అదంతయు తక్కువకాలములో నెరవేరుటకష్టము. ఓటరులకు ఎన్నికలన నేమో మొదలగువిషయములు తెలియనిచో నగరపాలనమునకు ఋజువర్తనులును సమర్థులును అగువారు ఎన్నుకొనబడుట అసంభవము కావచ్చును. ఇపుడు ప్రతిబహిరంగసభకును ప్రభుత్వమువారి, అనుమతి పొంది జరుపుటకు తగినకాలములేదు. నగరములో ఎన్నెన్నియో సభలు జరుగవలసియుండునప్పుడు దరఖాస్తులు ఎక్కువగును. వాటినన్నిటిని ప్రత్యేకముగా విచారించుట ప్రభుత్వమువారికిని సులభమైనపనిగాదు. అందువలన ప్రస్తుతము ఎన్నికల కొఱకైనను గష్తీనిషాన్ ౫౩ ను రద్దుచేయుట లాభకరమైనపద్ధతి.

ఇంకొకటి. పురపాలక సంఘసభ్యత్వమును కోరు అభ్యర్థులు తమతమ అర్హతలను ప్రజలకు విశదము చేసికొనుటకు అవకాశ మీయవలెను. సభలవలె పత్రికలు అటువంటి అవకాశమునీయజాలవు. ఆ అవకాశమిచ్చుటవలన ప్రజలకు లాభముగలదు, అభ్యర్థులకును న్యాయమొసగినట్లగును. వివిధపక్షములవారు వారివారి అర్హతలను ప్రకటించుకొనునపుడే నిజము బైటపడును. ప్రజలు వివేచనాశక్తితో ఎన్నుకొనుట సంభవించును.

ఎన్నికల సందర్భమున కక్ష్యలేర్పడుచో కొంత మనః పరితాపములకును తద్ద్వారా శాంతిభంగమునకును త్రోవతీయబడవచ్చునను భయము మాకు అర్థముగాకపోలేదు. బ్రిటిషుయిండియాలో స్థానికసంస్థల (తాలూకా, జిల్లాబోర్డుల) ఎన్నికలలోను, ఇంగ్లండు విదేశములలో ఎన్నికలలోను కక్ష్యలేర్పడుటయు, కొన్ని వేళల అవమానకరములగు క్రౌర్యములు జరుగుచుండుటయు ప్రపంచపరిస్థితులను గమనించుచుండువారికి తెలిసిన విషయమునే. గష్తీనిషాన్ ఆ ఉపద్రవమును తప్పించగలదు కాబట్టి అది అవసరమని ప్రభుత్వపక్షమున వాదింపబడవచ్చును. దీనికి సమాధానము వెదకవలసిన పనిలేదు. బ్రిటిషుయిండియాలో మొదట మొదట అట్టివి జరుగలేదు. కొంతకాలము అధికారపదములను రుచిచూడగా ఈ కక్ష్యలు బయలుదేరెను. మనరాష్ట్రములోనైనను ప్రస్తుతము భయపడవలసిన అవసరములేదనియే మావిశ్వాసము. ప్రభుత్వమువారు ఎన్నికల ప్రచారసభలు గలభాలుకాకుండ చూచుటకు తగు జాగ్రత్తవహించవచ్చునుగాని సభలనుజరుగనీయకుండ ఆటంకము కలిగించుట సరిగాదు. అత్యంతావసరములగు సభలనునిషేధించు శాసనముక్రింద ఎన్నికలను జరిపించుట నగరపాలనస్వాతంత్ర్యమును ఒకచేతితోనిచ్చి మరొకచేతితో కొద్దిగా లాగివేసినట్లు అగును. ఎన్నికలు తర్జనభర్జనములకును, కొట్లాటలకును, రక్తపాతములకును సమయములు గాకుండను, ప్రజల సభావాక్స్వాతంత్ర్యములకు నిర్బంధము లేకుండను నగరవాసులను నగరపాలనకు అర్హులనుచేయుటయందే ప్రభుత్వముయొక్క గొప్పతనము కానవచ్చును.

# ఇంగ్లండులో హర్తాలు

ఇంగ్లండునుండి ౧౭ వ తేదీనాడు "దక్కన్ న్యూసు సర్వీసు" దిగువవార్త ప్రకటించుచున్నది.

"జిల్లాపోలీసు శాఖోపాధ్యక్షులగు రంగయ్యారుగారు పోలీసుదళముతో సహా ఇంగ్లండుకువచ్చిరి. బొగ్గుగని కార్మికులు హర్తాళ మొనర్చిరని తెలియుచున్నది.

రహబరెదక్కన్ వరంగల్ విలేఖరి యీవార్తనే యిట్లు ప్రకటించుచున్నాడు.

"సింగరేణి కార్మికులందరును సంపూర్ణహర్తాళము గావించియున్నారు. బొగ్గుగని కార్యము లేమాత్రము జరుగుటలేదు.

జిల్లా తాలూక్దారుగారియొక్కయు జిల్లా పోలీసు మొహతమింగారియొక్కయు సహాయము నపేక్షించుచు కాలరీసు మేనేజరుగారు తంతి పంపిరి?

# పూర్వ గాథలు

"లక్ష్మణరాయ పరిశోధక మండలి"

శ్రీ శేషాద్రి రమణకవులలో నొక్కరగు శ్రీమాన్ దూపాటి శేషాచార్యులవారు మండలిపక్షమున పరిశోధన కర్తృత్వము వహించి, వారు దర్శించిన పలువిధ గ్రామముల వృత్తాంతములను తెలుపుచు చక్కని వివేకలు వ్రాసియుండిరి. అవియే ఇకపై వృత్తాంతములు ప్రకటింపబడుచున్నవి.

(గతసంచిక తరువాయి)

## బూరుగుగడ్డ

ఈవాక్యముల నాసక్తమురాజా పెద్దలకెరింగింప నీభక్తిశ్రద్ధలకు మెచ్చి యాళ్వారులు నీవ్రతమునకు భంగము కాకుండ నిట్లు వ్యక్తమైరి. కావున వీరిని నీయాలయమునఁ బ్రతిష్ఠచేయించి వారికారగింపు సమర్పించిన యనంతరము నీవు భుజింపవలసినది. అందుచే నీవ్రతము ఫలింపగలదనిరి. అతడట్లే యాయాలయమున నాళ్వారులఁ బ్రతిష్ఠసల్పెను. ఈవిధమున ప్రతిష్ఠచేసి నిత్యకైంకర్యముల మోఘముగ నొనర్చుచుండగా మహారాటకండు (బహుశః తురుష్కులు కావచ్చును.) వచ్చుచున్నారనివిని దేవాలయ వాసకులగు వారిమండగములకు తెరచి కోవెలలో సమర్పించిన బొడ్డుగంటలో నచ్చటి యుత్సవవిగ్రహములనుంచి కోటల ప్రాకారముననున్న కోనేటిలో స్థాపించిరి. తన్నిద్దరాళ్వారులను అండాళును గూడ కోవెలలోనే స్థాపించిరి. మూలవిరాటును కూడ మఱియొక కడభూస్థాపన మొనర్చిరి. కాలక్రమమున నాయకులకుమడగి యాయాలయమును దిరిగి యుద్ధరించి ప్రతిష్ఠింపనెంచి విచారింప మూలవిరాటిచ్చటను లభింపమిచేత నప్పటికచ్చట లభించిన యాదివరాహస్వామి మూలవిరాటును ప్రతిష్ఠించిరి. తర్వాత దర్వాత లభించిన నారసింహ వేణుగోపాలస్వాముల మూలవిరాటులనుగూడ ప్రతిష్ఠించిరి. కాని యాళ్వారుల ప్రతిష్ఠమాత్రము జరుగలేదు.

ఇట్లుండ నాగ్రామయజమాని యగు కలెక్టరులని స్వప్నమున నాళ్వారులు వైష్ణవస్వాములవలె గనఁబడుచు మాకాహారము నొసంగుమని కోరుచుండిరి. ఈవిధమున జరుగుట నాతడు సామాన్యస్వప్నముగ భావించి త్రోసివుచ్చుచుండెను. దినదినము నిదేవిధముగ జరుగుటకాతడు విసివి పెద్దలైనవారితో నావంగతి యేమని యడిగెను. అందుల కార్యులాళ్వారులు నీస్వప్నమున సాక్షాత్కరించి తమ్మాయాలయమునఁ బ్రతిష్ఠసల్పుడని కోరుచున్నారు. కావున నేటిరాత్రికి స్వప్నమున వారుగన్పించినపుడు మీరెచ్చటనున్నారు. ఎట్లుగుర్తింప గలుగుదునని యడుగుమని యాతనికెరింగించిరి. అతడట్లే కలలో కన్పించిన స్వాముల నడుగ నాలయమున భూస్థాపితమైయుంటిమి నీవు మమ్ముద్ధరింపనెంచి నపుడొక గరుడపక్షి వ్రాలియుండును. అచ్చోటనే ద్రవ్వినచో లభింతుమని తెలియఁగించిరి. మఱునాడాతడు తనపరివారముతో నాచోటికరా నచ్చట నొక గరుడుడు నిలిచియుండ గాంచి త్రవ్వింప నాళ్వారుల సన్నిద్ధరుడు దొరకిరి. మహావైభవముతో వారినాయాలయమున ప్రతిష్ఠసల్పెను. ఇట్లాయాలయము మహాస్థలమై భక్తులొసంగిన వృత్తులతో నిత్యోత్సవమున నలరారుచుండెను. కాని అండాళు ప్రతిష్ఠమాత్రము లోపించియుండెను. అందులకు విచారించి భక్తులొకరు దక్షిణాదినుండి యాండాళువిగ్రహమును దెప్పించి ప్రతిష్ఠింపనుండ నా భక్తుని స్వప్నమున నాండాళుతల్లి గన్పడి తానువెల్లటూరు గ్రామబహిర్భాగమున నున్న పుట్టలో నుంటిననియు, ప్రతిదినమచ్చటికిఁ గొన్నియావులేతెంచి పుట్టపై క్షీరములువర్షించి పోవ వానితో దృప్తినొంది కాలక్షేపము చేయుచుంటిననియుగావునఁ దన్నుఁగొనివచ్చి ప్రతిష్ఠసేయ వలసినదని తెలియగించగా నాతడట్లెయచ్చోటికేగి యాయాండాళువిగ్రహమును గొనివచ్చి ప్రతిష్ఠయొనర్చెననియుఁ జెప్పుచున్నారు. ఈకథా విధానమంతయు నీకోవెల స్థానాచార్యులు శాల్మలీకందనందనపరిణయమన్న ప్రబంధము వ్రాసియున్నారు

ఇందెంత యదార్థమున్నదియును పాఠకులే యూహింతురుగాక. ఇక నీయాలయమునుగూర్చి వ్రాయుచున్నాను. ఆలయము దివ్యమైన ప్రాకారములతో నుండి దక్షిణమున సింహద్వారము గల్గియున్నది. సింహద్వారము మిగుల నెత్తైనదనభాగమున నొక పెద్దమంటపము నంటియున్నది. ఈద్వారమునకు గొంతముందుగా నింకొక పెద్దద్వారమున్నది. అది ప్రహరితో సంబంధించినదై యుండును. ప్రహరియంతయుఁ బడిపోయియున్నది. ఈప్రహారీ నిప్పుడొకమహనీయుడు గట్టింప బ్రయత్నించు చున్నాడు. ప్రహరికి సంబంధించినద్వారమున నూరి యాడిగవారు తమకల్లు లొట్లతో బూజింపుచున్నారు. రెండవ ప్రాకారికి నానకొనియున్న మంటపమునకు పడమర వైపున పదునారుమూరల నిడిగనల పద్మనాభస్వామి యనబడు రంగనాయక విగ్రహమున్నది. ఈవిగ్రహము మిగుల నచ్చెరువు గొల్పుచున్నది ఈవిగ్రహము స్నిగ్ధముగాలేదు. శేషుని పడగపై భాగమున ఛత్రమువలె నొప్పుచున్నది. తొడలపై భూనీళలున్నారు. తలకొక కిరీటమున్నది. వక్షముపై నొకచేయియు తలక్రింద దిండుగా నొకచేయియు నొప్పియున్నది. ఈవిగ్రహమును ప్రతిష్ఠింపనెంచి యాలయముగట్టించిరట కానియాదవునికి దృష్టిగా నారగింపులు సాగవని పెద్దలెరింగించుటచే మానియిచ్చుటనుంచిరని చెప్పుచున్నారు

[ సశేషము ]



హైదరాబాదు

## బజారు ధరలు

( కోడూరవు లక్ష్మీనరసయ్య ఉస్మాన్‌గంజ )

24—5—1934

| | | | |
|---|---|---|---|
| గోధుమలు:-జెలాల్య మొదలు పల్లా 1కి | | రు12 | 0 |
| | వరకు | 12 | 8 |
| బియ్యము:—దొడ్డువి | మొ | 11 | 12 |
| నానకరాంలు కొత్తవి | మొ | 11 | 8 |
| | వరకు | 12 | 0 |
| డిటో | పాతవి | 12 | 0 |
| | వరకు | 12 | 8 |
| ,, క్రిచిసాంబారులు | కొత్తవి,, | 13 | 0 |
| డిటో | పాతవి | 14 | 12 |
| | వరకు | 15 | [illegible] |
| ,, రామసాగరాలు | కొత్తవి | 11 | 4 |
| డిటో | పాతవి | 12 | [illegible] |
| కందులు | పెద్దవి | 10 | 12 |
| | చిన్నవి | 9 | 12 |
| కందిపప్పు | పెద్ద మొ | 14 | 12 |
| | వరకు | 15 | 0 |
| | చిన్నవి | 13 | 12 |
| | | 14 | [illegible] |
| పచ్చపెసలు | | 8 | [illegible] |
| | వరకు | 9 | [illegible] |
| పెసలపప్పు | | 14 | 0 |
| నల్లపెసలు | | 5 | 8 |
| మినుములు | | 8 | [illegible] |
| మినప పప్పు | | 14 | [illegible] |
| ఉలవలు | | 4 | [illegible] |
| జొన్నలు | | 9 | 8 |
| శిరిసెనగలు | | 12 | 4 |
| వుప్పు | | 11 | 12 |
| తవుడు | | 3 | [illegible] |
| పత్తిగింజలు | మొ | 6 | [illegible] |
| అలచందలు | | 8 | 12 |
| అనుములు | | 7 | 0 |
| బటానాలు | | 7 | 8 |
| బెల్లము | | 17 | 4 |
| ఎఱ్ఱచక్కెర | | 17 | [illegible] |
| | వరకు | 17 | [illegible] |
| వేరుసెనగ గింజలు | చిన్నవి మొ | 8 | [illegible] |
| పసుపు | | 14 | [illegible] |
| | వరకు | 14 | [illegible] |
| మిరపకాయలు | మొదలు ,, | 60 | 0 |
| | వరకు ,, | 70 | 0 |
| చింతపండు | మొ | 9 | 0 |
| మెంతులు మంచివి 16 సేర్లకు | | 1 | 12 |
| | వరకు | 2 | 0 |
| అల్లం 12 సేర్లకు | మొదలు | 1 | 8 |
| | వరకు | 1 | 12 |
| వేరుసెనగనూనె | తె 12 కి | 2 | 6 |
| నెయ్యి | తె 40కి | 46 | 0 |
| | వరకు | 47 | 0 |
| తెల్లగడ్డలు | మొ తె 12 కి | 1 | 8 |
| | వరకు | 2 | 0 |
| ఎఱ్ఱగడ్డలు పల్లా 1కి | మొ | 3 | 0 |
| | వరకు | 3 | 8 |
| మద్రాసు చక్కెర | దొడ్డుది | 13 | 8 |
| | వరకు | 13 | 10 |
| సెనగలు | మొ | 11 | 0 |
| సెనగపప్పు | మొ | 14 | 0 |

ఈబనియాల పాలనతో ఇందూరు ప్రజలకు వినుగత్తెను. రైతులకు భూమిపన్ను భారము ౧౦౦కి ... హెచ్చెను. సంస్థానమందలి యితర్ప్ర... స్థితి యసంతృప్తికరముగ నుండెను. మహారాజాగారు యీరోజు సంచారమునకు పోవుచున్నారని తెలియకనే ప్రజలు తామెది క్కులేనివారమని తెలచిరి. అయినను వారేమిచేయగలరు! ... చేయకూడదు. పత్రికాస్వాతంత్ర్యము లేదు.

... సమయములో ఒకప్రచారకుడు ఇందూరు ప్రజలకష్టములను తెలియజేయువార్తలను వివిధపత్రికలనుండి సంగ్రహించి వాటినంతయు ఒకగ్రంథముగా రచించి దానిని అచ్చొత్తించుటకై ఒకప్రెస్సుకిచ్చెను. ఖుఫ్యావారికిది తెలిసి పుస్తకమును అచ్చొత్తించవలదని ప్రెస్సువారినడిగిరి కానిపుస్తకము అచ్చుచేయబడెను. ఇకనేమిచేయవలెను. కొందరు అధికారులు పుస్తకము ప్రచురణకర్త యొక్క పేరునడిగిరి. అదిచెప్పబడకపోగా అదాలత్ చర్యగైకొందుమని అధికారులు బెదరించిరి. ప్రెస్సు ప్రింటరు సరేనని చెప్పెను. అబెదరించిన అధికారులు పుస్తకప్రతులను వివిధన్యాయవాదులకు పంపి అదాలత్ చర్య గైకొన వీలున్నదాఅని అడుగ ఎక్కువమంది వీలులేదనిరి. ఒకన్యాయవాదిః మాత్రము కొద్దిఅవకాశమున్నది. అయితే విచారణలో అధికారులపక్షము ఓడినచో చాలా అపకీర్తియగునని చెప్పెన.

ఇప్పుడేమిచేయుట. ఏదోనేరము మోపి కిందికోర్టులో శిక్షవిధింపజేసినను ప్రధాన న్యాయాధిపతి రాయ్‌బహదర్ జగన్నారాయణ్‌గారు అటువంటి అక్రమచర్యలను గర్హించు న్యాయశీలుడు కాబట్టి తుదకు మొకద్దమా ఓడవచ్చును. పోలీసువారి సహాయము పొందుదమా అశాఖాధికారియగు ... గారు ఈ దొంగచర్యకు అనుకూలించునను నమ్మకములేదు. కాబట్టి అధికారులు వేచియుండిరి. ... గారు పోలీసు శాఖాధిపత్యము వహించిరి. ఆయన లీగల్ రిమెంబ్రెన్సరు అగు మిత్రగారికి మిత్రుడు ఈమిత్రగారె చర్యగైకొన వలసినవారు కాబట్టి చిక్కుతీరెను. ఏదో యొకసాకుతో పుస్తకప్రచురణకర్త సంస్థానమునుండి తరిమివేయబడెను.

ఈ పరిస్థితులలోగూడ కొందరు ధైర్యముతో నిజము బైటబెట్టుచున్నందున వాస్తవస్థితి తెలిసెను. ప్రభుత్వమువారు సమాధానము చెప్పవలసివచ్చెను. ఒక ఉపాయ మవలంభింప బడెను. సంస్థానాదాయమును హెచ్చించుటకును వ్యయము తగ్గించుటకును మార్గములనుసూచించుటకై ప్రధానమంత్రి అధ్యక్షుడుగా నొక కమిటీ నియోగింపబడెను. ప్రపంచావృతమైన ఆర్థిక దుస్థితి ఇందూరు సంస్థానముపై బడుటవలన ఇది అవసరమని చెప్పబడెను. చుట్టుప్రక్కలనుండు సంస్థానములను రాష్ట్రములను దాటుకొనివచ్చి ఆర్థిక దుస్థితి ఇందూరునే మాత్రమే బాధించుటయెట్లో? ౧౯౨౭-౧౯౨౮ అక్కౌంటెంట్ జనరల్ రిపోర్టులో అనంవత్సరముల మధ్యనుండు సంవత్సరములన్నింటికి ఆదాయవ్యయములు చక్కగా నేపోవుచుండెనని గలదు. ఈమాటతో ఆర్థిక దుస్థితియను సమాధానము నకు సమన్వయమేలాగు?

---

# ఆశీర్వచన రత్నములు

మ. రా. శ్రీ. సడకుడ నారసింహారెడ్డిగారి వివాహసందర్భమున బీరం సుబ్బారెడ్డికవిగారిచే చదువబడిన పద్యములనుండి ఉద్ధృతపంచకము.

ఉ॥ శ్రీకరమూర్తి వంచుసర • సీరుహగర్భను ... రస్తుత
శ్లోకుసెసంచునిపదస • రోకహాసన్నిధిలో వరించి ర
స్తోకతరానురాగమున • సూనృతజాలసుశీలసాధ్వి పు
ణ్యాకరనారసింహవరు • ధాధిపు లెంతయువీరలిద్ధరక్
ప్రాకటపుత్రపౌత్రవిభ • వాఢ్యులజేయగదయ్య రాఘవా॥

మ॥ రసికాగ్రేసరచక్రవర్తి సమదీ
క్షణాశ్యాగశీలాంకితుం
డసమానప్రతిభావిలాసుకుత్వదీ
యాంఘ్రిద్వయంబంటెమా
కరుధీశాగ్రణివారసింహధరణీ
పాలుండు గార్హస్థ్య
ధర్మసముద్భాసితుడయ్యె • వీరికి సు
పుత్రప్రాప్తి దాంపత్య సౌ
ఖ్యసమున్లాసముగూర్పుమయ్య రఘునాధా
దీవరత్నాకరా॥

చ॥ ప్రముఖ్యముచున్న హాంతము • ప్రోలనవిల్పియు దేవధూళిపి
జక్కువపిట్టలట్లు గుణ • సంపదనెంతయు ...
వర్ణజముప్పకొండోగల యుందను రాగచిరాయురర్థముల్
మక్కువమీరవీరికి • మాన్యులజేయగదయ్య రాఘవా॥

గీ॥ అగమాన్నాయమంత్రని • యామకముగ
వైదికపౌరోహితుడుకథూ • వరులకస్త్ర
బంధనము బంహ్మముడిగాగ • ప్రజలెటుంగ
తమర్యదేమానురాగబం • ధంబుహృదయ
ఫుటములకుగట్టిపెచిరయ • పుటికివీరి
కుండజేయగదయ్య కో • దండరామా॥

సీ॥ పదపంకజస్పర్శ • బంధురగ్రావంబు
నాతిగాజేసిన • నాటిమహిమ
దృఢచిత్తవిస్ఫూర్తి • నినగూనసాక్తిబో
గొట్టెట్టగజేసి • నట్టిత్రేమ
అభయహస్తక్రియ • సరిసోదరునిలంక
కధిపుగాసమరించి • నట్టికరుణ
అంగుళీచిహ్నముద్ర • నంజనిసుతుబహ్మ
జ్ఞానుపుగనొన • ర్చినమహత్తు

గీ॥ తావకీనపాదాంబుజ • ధ్యానరతులు
బాలకులగామిరంపుడం • పతులువీరి
భూశ్రయలవీరయిడజూపి • ప్రోవుమయ్య
అర్కకులవార్థిసోమప • ట్టాభిరామా॥

---

# ఆంధ్ర గ్రంథమండలి

మారీస్ పేట, తెనాలి,

## స్థాపితము 1928

రాబోవుచున్నది వీతికాలఘువివరణసహిత శ్రీమదాంధ్ర మహాభారతము, శాంతిపర్వము క్రౌను సైజు: పూర్తి క్యాలికో; మూడు భాగములు

| | భాగం॥ 1 కి | | 3ఒకేసారి |
|---|---|---|---|
| చందాదారులకు | 0-11-0 | ... | 2-0-0 |
| యితరులకు | 1-0-0 | ... | 2-8-0 |
| లైబ్రరీలకు | 2-4-0 | ... | 2-4-0 |

వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

వివరములకు:—

కె. ఎ. డి. ప్రసాదరావు. బి. ఎ.
ప్రొప్రయిటరు

---



# మహకమనిజామత్ ఆబ్కారి ముల్కె సర్కారె ఆలీ

## ఇష్తెహార్

దీనివల్ల తెల్యచాయటం ఏమనగా హలుదూదు అబుకారి బల్దావ సికింద్రాబాదు వ జిలేకుందకు అత్రాపుబల్దా వ మహబూబునగరు తాలూకా భోనగీర్ వ పట్టి బీపేట రాజంప్యాట వ మ్యా తుమ్మెద. తాలూకా కామారెడ్డి వ యెల్లారెడ్డి జిలా నిజామాబాదు, వ వర్భని, కరీంనగరములో మద్రాస్ సిస్టము జారి అయ్యియున్న వ కావున యేవ్వార్లు యింతెజాము అయితే మద్రాసు సిస్టముపైన అయినదో ఒకవేళ అవ్వారులో నెంబర్లు వేయకుండ గీయుటము విషయమయ్యి యెవరయిన ముగుబరి చేసినట్టుఅయితే మొగుబరుకు ఒకేతావార్‌లో సగముహిస్సా [౧౦౦] రూపాయిలవరకు యినాము వలెయిచ్చబడును.

ఆముగుబిరు దరుఖాస్తు ముగుబరిలో పూరి పేరుమ రిన్ని గుంటిపేరు లేక సర్వేనెంబరు వ్రాసి టప్పాజరియాన ముహతమిమును జిలాకు లేక మహకమా నజామతుకు పంపవలెను. సదరు దరుఖాస్తులో యెన్నిరోజులనుంచి గీస్తువున్నది లేక గీయుటము అయ్యివుంటె యెన్ని దినములు అయ్యినది సరాహతు చేయవలసినది ముగుబరి చేసేవానిపేరు రహస్యముగా వుంచబడును. యెవ్వారికి తెలియుచేయబడదు.

మెవద్ నాజి సోడము తెబుకాత్

# స్వార్థపరులచే జిక్కిన ఇందూరు సంస్థానం

## పత్రికలకు లంచములు

ఇందూరురాష్ట్రీయుల అసహాయత.

### ప్రభువుగారు మొదట మైనరు, తర్వాత యూరోపు సంచారము

[గతసంచికలో యిందూరునగూర్చి వ్రాయబడిన దా నితరువాత భాగముగా నుక్రిందివిషయములను చేర్చుకొనవ లయును. ఇందూరు సంస్థానములో బాప్నాగారు విరంకుశా ధికారము నార్జించినతరువాత తనపదవిని నిల్పుకొనుటకై ఎ న్నెన్ని అనవసరములైన ఉద్యోగములను క్రొత్తగాసృష్టించి సంస్థానమునకు భారము కలిగించవలసివచ్చెనో గతసంచికలో వివరించబడియుండెను. ఇప్పుడుకొందరు పత్రికాధిపతులు బా ప్నాగారిపక్షమున ప్రచారము చేసినందుకై వారికి బాప్నా గారు ఎవిధముగా లంచము లీయవలసివచ్చెనో, నుప్పరి పాలనము దూషించుటకుచేయబడిన ప్రచారము ఎంతకష్ట ముపై అప్పటికైనను అన్యాయముగాచే—అరికట్టబడెనో, ఈవిషయమున ఇందూరు సంస్థానమందలి ముల్కీప్రజలు ఎం త ఆగ్రహావిష్టులైనను ఏవిధముగ నిస్సహాయులైరో—తెలియ జేయబడుచున్నది. విషయములన్నియు ౧౩ మే ౧౯౪౩ వ తా రీఖునాటి క్రిష్ణి యిండియాలోనివి.

[గో. ప. సం.]

ఇదివరకు కన్హైయలాల్ నందలాల్ భండా రి అనుబనియా తన లాభమునకై సంస్థానమునకు నష్టముకలిగించినవిధమునకు కొన్ని ఉదాహరణ ములీయబడి యుండెను. రిసీవరు వశములోనుండి న యశ్వంతరావు బ్రిష్ ఫ్యాక్టరీ రిసీవరుకునోటీసు నీయకయే రహస్యముగా కన్హైయలాలుకు అమ్మి వేయబడెను. భవనముతో కలిసి ఫ్యాక్టరీని మొ దట రూ ౫౦౦౦౦౦ లు పెట్టుబడియైనది. భం డారికి అంతేయు రూ ౬౦౦౦౦ లకుదొరకెను. అది యు మళ్లవైనవాయిదాలగా చెల్లించునట్లుఏర్పా టు. ఇంకొకటి. సంస్థానమువారు ఇందూరుకు ౯ మైళ్లదూరమున పాలయాస్టేషనుకు దగ్గఱ ఒకకా గితముల మిల్లును స్థాపించదలచిరి. ఇందుకు కావ లసిన సామ్మ్రియంతయు క్రైటెవారినుండి తెప్పిం చబడెను. భండారిగారి సొంత "భండారిమిల్లుకు" యంత్రపరికరము లవసరములు కాగా ముందుజె ప్పినమిల్లుయొక్క సొత్తంతయు వేలము వేయబడె ను. ఆవేలములో భండారినియమించిన మిత్రు లే మితిమీరిన చౌకధరకు అసామానంతయు భండారి కొరకై కొనిరి. క్రొత పవర్‌హౌసు (యె లెక్ట్రిసిటీ తయారుచేయబడు యంత్రాలయము యొక్క పరికరములన్నియు అమ్మివేయబడు సమ యమున ముల్కీయొక్కయు బయటివారియొక్క యు నోళ్లుమూయబడెను. సామానంతయు రూ ౧౦౦౦౦ లకు భండారికి లభించెను. మరల వాయి దాలఏర్పాటు సంస్థానమునకు రూ ౨౦౦౦౦౦ ల నష్టము. ఇవన్నియు చాలనట్లు బాప్నాగారుభం డారిని అతడు మిల్లుకట్టించుకొనుటకై బాడుగలే కయే పెద్దవిశాలప్రదేశమును యిచ్చుట, ఎంత లేదన్నను ఆప్రదేశముయొక్క సౌకర్యములను బ ట్టి దానికి సంవత్సరమునకు రూ ౧౦౦౦౦ లు బా డుగగా రావచ్చును.

### పత్రికాధిపతుల దోపిడీ

ఇంక రంగము మార్చెదము. ఇండ్యాప్ర ధానపాత్ర ఇదివరకు బొంబాయిలో వెలుగుచుం డిన ఇండియన్‌స్టేట్సు జర్నల్ అను పత్రికయొక్క సంపాదకుడు ఆర్ వెంకట్రాం. ఇతనిపనిఒకటియే బాప్నాగారి పరిపాలనము నభినందించుట. బ్రి టిషు పరిపాలనమును చిన్నజేయుట. అతనిపత్రిక అమ్ముడుపోవుటయే అతనికి ప్రధానము. అం దుకై అతడు తానుకాంగ్రెసువాదిననియు, భార తదేశమును విదేశీయుల భారమునుండి విడుదలచే యుటయే తనయుద్దేశ్యమనియు ప్రకటించుకొను చుండెను. ఇందుకై బ్రిటిషువారిదూషణ. యెన్ని యెత్తులు ఎత్తిననేమి. తనపత్రికను ప్రజలాదరించ లేదు. ఉన్నారుగా మనబాప్నా. ౧౯౩౨నుం డి లెక్కచూచినచో వెంకట్రాంకు ఇందూరుసం స్థానమునుండి నాలుగేండ్లలోవచ్చిన విరాళము రూ ౨౫౦౦౦ లు ఇదియంతయుకూడ అతని అ ప్పులను తీర్చలేకపోయెను. ప్రెస్సువనివాండ్ర జీత ములుబాకీ: ఇంటిబాడుగ ఒకసంవత్సరముదిబాకీ ఏటుచూచినను లావునారూపాయలు, అనుబెదరిం పులే. జైలులో పడవలసివచ్చునో ఏమోకర్మము ని భయపడి ఒకనాటిరాత్రి వెంకట్రాం యిందూ రుకుచేరెను. చేరుటయే తొందర, అప్పుడేబాప్నా గారి అనుగ్రహముచే సంస్థానప్రెస్సు అతనివశ ము చేయబడెను.

వెంకట్రాం పాలియాకుపోయి అక్కడమం చిసొత్తుచూచెను. పాటపాడినచాలును. తనక దివచ్చును అని కనుగొని నెమ్మదిగా దానిని కొ ట్టివేసెను. బహుశా ఇదిజరిగిన కొద్దికాలమునకే కాగితపు పేపరుమిల్లుకై సంస్థానమువారు కొనిన బాయిలరు కనబడకుండ పోవుట. అందుపై ప మిరా, అంతబాయిల రెక్కడ పోవును అని ఆం దోళనవ్యాపించుట తుదకు వాణిజ్యశాఖామంత్రి కి విచారణవల్ల తేలినది, బాయిలరు పోయినది. అనిమాత్రమే.

దివానుగారు తనకును తనపరిపాలనమునకు నువిరుద్ధముగా వార్తలనుగాని విమర్శనలనుగాని ప్ర కటించుపత్రికలతో విశేషముగా పోరాడవలసివ చ్చెను. ఒకసారి అనగా మహారాజ్ఞ తుకోజీరావు గారు కమిటీవద్ద విచారణపొందుటకై సింహాసన మును వదలిపెట్ట వలసివచ్చినపుడు మహారాజుగా రిఆశ్రితులందరు వారి జైసినిసౌధములోవారి చుట్టునుచేరి కడపటిసారి అనుగ్రహములను కోరిరి. ఒక ఆఫీసరు రూ ౫౫౦౦౦ ల అప్పును మాఫీచే యించుకొనెననియుమరికొందరు పెన్షనులను సం పాదించు కొనిరనియు, దివానుగారు నెల ౧కి రూ ౧౫౦౦ ల పెన్షనును సంపాదించుకొనెననియు ఒకవార్తాపత్రిక ప్రచురించెను. ఈరహస్య విష యమును తనకపకీర్తికరమైనదానిని బైటపెట్టిం చినందుకు కారకుడైన విలేఖరిని దివానుగారు రాష్ట్రమునుండి వెడలగొట్టించిరి. దివానుగారు ఒకపత్రికకు తాను చెప్పినట్లువిను ఒకప్రొఫెసరును విలేఖరిగా నేర్పాటుచేసిరి. కొన్నిపత్రికలు లంచ ములచే తృప్తిపొందింప బడుటను గమనించి అనే కఆంగ్ల పత్రికల తరఫునను దేశభాషాపత్రికల తర ఫునను విలేఖరులు విశేషముగా ఇందూరులో ప్ర వేశింపసాగిరి. వీరందరును పరిపాలనలోపములను పత్రికలలో ప్రకటించెదమని బెదరించి దివాను నుండి విశేషముగా లంచములను ఆకర్షించుచుండి రి. అదిమొదలుకొని పత్రికలలో ఇందూరునుగు రించి పద్మిప్రకటింప బడినను అదంతయు బాప్నా గారిని స్తుతించునదే. ఈబాప్నా స్తుతితోబాటు బ్రిటిషు గవర్నమెంటు దూషణ పత్రికలపాలిటి ఆయెను.

మహారాజుగారి మైనారిటీతీరు పోవుకాల మునమీపించు చుండెను. మహారాజుగారు మైనా రిటీతీరి అధికారముచే పట్టానేపాతదివానుగారిని పెన్షనుపై పంపించినచో దివానుగారి ఆశ్రితులవని యెట్లుఅను హృదయాందోళన మొక్కవయ్యెను. దివానుగారిని వెళ్లిపొమ్మన్నను వారిపెన్షనువారి కున్నదికాబట్టి దిగులులేదు. మధ్యలోభయము బాప్నాగారి ఆశ్రితులకు ఎంతమంది బాప్నాగారి ఆశ్రితులు ఇందూరు ప్రభుత్వోద్యోగములతో నా న్నారోవారందరిని నౌకర్లుపోయినను పోవచ్చును. పూర్వముకంటె తక్కువపదవులు రావచ్చును. ఇవంతయు చూచినాను బాప్నాగారి ఆశ్రితులు వెంటనే పత్రికలు బాప్నాగారిని వారిపాలనను ప్రశంసింపసాగెను. బాప్నాగారి ఉద్యోగకాలప రిమితిని పొడిగించవలసినదని అభిప్రాయముల నీ యసాగెను పత్రికల ప్రచారమునెగ్గెను. దివాన్ బహదర్‌గారి గతనాలుగు సంవత్సరములు దివా నుపదవియందేఉండిరి. మరి 3 ఏండ్లైనచో పత్రి కలు శిఫారసుచేసిన కాలము పరిపూర్తి అయి ఉం డెడిది. పత్రికలేకాక దివానుగారి మిత్రులుపలు వురురహస్యముగా దివానుగారికై ప్రచారముచేసి యుండిరి. వారికందరికిని దివానుగారు సంస్థానపు ధనముతో కృతజ్ఞతచూపవలసి వచ్చెను. తుదకున ష్టము సంస్థానమునకే. ఈప్రచారములోనే ఒకచి త్రము! ఒక ప్రసిద్ధ పత్రికలో ౧౯౧౧—౧౯౩౬ సంవత్సరములమధ్య ఇందూరు పరిపాలనము నీచ ముగా దూషించబడుచు బాప్నాగారి పాలనము దానితో పోల్చబడి అధికముగా స్తుతింపబడెను. ఈదూషణస్తుతులకు కారకుడు ౧౯౧౧—౧౯౩౬ సంవత్సరములమధ్య ఇందూరు మంత్రివర్గమందు చేరిన ఒకగొప్ప సభ్యుడే; అతనికెంత సిగ్గులేదో!

౧౯౩౦ మే ౯ నాడుమహారాజగారు మై నరుతీరి సింహాసనమెక్కు దివసము. ఆనాడు పత్రి కాధిపతులు లంచగొండులు పలువురు చేరిరి. వా రికై సుమారు అర్ధలక్ష రూపాయలుఖర్చు అ య్యెను. ఈద్రవ్యముతో ఒక్కసంవత్సరకాలము ౨౦౦ ప్రాథమిక విద్యాలయములను పోషించియుం డవచ్చును.

(౧౦వ పేజీ మొదటికాలము చూడుడు.)

## గోలకొండపత్రికా కార్యాలయమున వెలకుదొరుకు గ్రంథములు

| | |
|---|---|
| హిందువుల పండుగలు | 1-8-0 |
| ఉచ్చల విషాదనాటకము | 0-12-0 |
| శిశురక్షణ | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-2-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| జీడికంటిరామ శతకము | 0-1-0 |
| బమ్మెరపోతనామాత్యవిజయము (హరికథ) | 0-1-6 |
| తిప్పన్నచరిత్ర | 0-0-6 |
| రఘునాథ | 0-1-6 |
| చారుమీనారు | 0 1-6 |
| పంచముల చరిత్ర | 0 3-0 |
| హాలీకర్లారు జంత్రి | 0-2-0 |
| కాళ్లు కుబూలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రాంసరీనోట్లు ,, | 2-0-0 |

వలయువారు,—
గోలకొండపత్రికాలయము త్రూపుబజారు
హైద్రాబాదు (దక్కన్)

## వర్తకులకు లాభము

గోలకొండ పత్రికయందు ప్రకటనవేయించి మీవ్యవహారమునందు లాభముపొందుడు. ఈపత్రిక ... రాష్ట్రమునందంతటను బ్రిటిషిండియాయందును విరివిగాప్రచారముచేయుచున్నది. ప్రకటనరేట్ల వివరములకు:— "మేనేజరు గోలకొండపత్రిక హైదరాబాదు, అని వ్రాయుడు.







REG. No. N. 45 Reg. No. M. 218

STAMP

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy